

శ్రీ

# ప్రబోధిని.


శ్రీ కృష్ణా, గుంటూరుమండల విశ్వబ్రాహ్మణ
సమాజ పక్షమున ప్రకటింపఁబడు మాసపత్రిక.

ఇందు, నీతి,మత,సంస్కరణ,భాషా, శిల్పవిషయములు చర్చింపఁబడును,

సంపుటము. 7. } గుంటూరుజిల్లా,దుగ్గిరాల, ఫిబ్రవరి,మార్చి 1915 } సంచిక.2, 3.


## శిల్పము - శిల్పి!

భూమి మొట్టమొదట యావిరిరూపముగనుండి క్రమముగానుదకమైదాని యందుజనించిన ఘనపదార్థము క్రమముగాపెఱిగి మట్టియును గుట్టలునునై ప్రపంచ మేర్పడెనని శాస్త్రజ్ఞులు వ్రాయుచున్నారు. కావుననే అగ్నివలన జలమును జలమువలన పృథివియు జనించునని చెప్పెదరు. అగ్నిచే కట్టెలు మున్నగు కొన్ని యుపధాతువులు కాల్పఁబడి బొగ్గులు, బూడిద, అంగారవాయువు మున్నగు మార్పులను జెందుచున్నవి. వాయువుచే దుమ్ము ఒకచోటికెగరగొట్టఁబడి మిట్ట పల్లముగను, పల్లము మిట్టగను చేయఁబడుచున్నవి. ఉదకమునందలి రాళ్లుఇసుకగా మారుచున్నవి. పర్వతములుసైతమొక చోటునుండి మఱియొకచోటునకు మార్చఁబడుచున్నవి. ఈతీరున పంచభూతములయొక్క పరస్పరసహా

యవిరోధములవలన పదార్థము లొకరూపమునుండి మఱియొకరూపమునకు మా ... పదార్థమొకరూపమునుండి మఱియొకరూపమునకు మార్పు ... ఈశ్వరుని దారు శిలా లోహ పదార్థము లొకరూపమునుండిమఱియొక రూపమునకుఁ దిరుగుచుండుట తామే మార్పుబడుటవలన శిల్పమే సృష్టియనియు, అట్టిమార్పులకన్నింటికి విచ్ఛలపడి నవకాశమిచ్చునది ఆకాశభూతమనియు, ఈపంచభూతములచే నడుపఁబడు శిల్పమున కాద్యంతములు లేకుండుటచే ఆద్యంతరహితుఁడును మన జ్ఞాన నేత్రమునకు మాత్రము ప్రసన్నుఁడగువాఁడునొకఁడుండవలయునను మతము ననుసరించి సృష్టికర్తయే మహాశిల్పియనినమ్మఁబడుచున్నది.

ప్రపంచమునందలి సమస్తజీవులలో మనుజున కధికజ్ఞాన ముండుటవలన పదార్థములనొకరూపమునుండి మఱియొకరూపమునకు దెచ్చుటకు ప్రయత్నించుచున్నాఁడు. బుద్ధిమంతులగు మనుజులు శిల్పమును తామభిమానవిద్యగానెంచి కృషి వాణిజ్య గృహోపకరణములకును, నీతి, మత సాంఘిక ధర్మములను, ఈశ్వరభక్తి, ముముక్షుమార్గములను బోధించుటకు సాధనములుగను, దానినుపయోగించుచున్నారు. అందులకై శిల్పి ప్రపంచమునందలి వస్తువుల నన్నింటిని దారు శిలా లోహ పదార్థములుగను వానియందలి అంతశ్శక్తులను వాయువిశేషములుగను విభజించియున్నాఁడు.

ఒకజాతివృక్షమునకు మఱియొకదాని శాఖనంటఁగట్టి వృక్షముయొక్క వేర్వేరు శాఖలయందు వేర్వేరు ఫలపుష్పములను ఫలింపఁజేయుట; ఒకజాతి తీగను వేఱొకజాతి ఫలము ఫలింపఁజేయుట; కొన్నిదోహదక్రియలచే ఒక్కొక్క ఋతువులోమాత్రము ఫలించుపుష్పములను సర్వదా ఫలింపఁజేయుట మున్నగునవి వృక్షశిల్పమనఁబడును. త్రాటిచెట్టున మామిడికాయలు గాయించుటయు వేపచెట్టున నొక మామిడికొమ్మ యుండునటులఁజేయుట, గుమ్మడితీగను వంగకాయలను కాయించుట, తెల్లని పుష్పములకు పలురంగులచుక్కలు పుట్టునటులఁజేయుట మున్నగునవి నీశిల్పమునఁజేరును. పుష్పములనుండి అత్తరువు మున్నగు పరిమళద్రవ్యములను తీయుట, ఫలములనుండి రసాయనములఁదయా

రణములును, మహోపకరణములును వచనభోజనానుకూలపాత్రలు, ఆభరణములు మున్నగువానిని చేయుదురు.

దారు శిలా లోహములచే ననేక విగ్రహములు నిర్మింపఁబడి యవియన్నియు ప్రజలకొక్కొక్క పాఠమును బోధించుచున్నవి. పాఠమును మాటలలో బోధించుటకంటె విగ్రహములతో బోధించుట సులభము. "ఒకటి రెండు మూడు చేరి మొత్తమెంతయగును" అని యంకగణితము గ్రహింపఁజాలని విద్యార్థులకు వరుసగా చేతివ్రేళ్లను చూపిన నైదని చెప్పి గణితమును సులభముగా గ్రహింతురు. విద్యార్థులకు బోధించుటకు గావలసిన సమస్తసాధనములును విగ్రహములుగా నెంచఁబడును. విగ్రహమువలన బాలురకు పాఠమును, మూఢులకు భక్తిమార్గమును బోధించుటకు శిల్పముపకరించును. ప్రపంచమునందలి సమస్తవిషయములు విగ్రహములవలననే బోధింపబడుచున్నవి. విగ్రహముల నారాధించుట భక్తిమార్గమును సృష్టించుటకు సాధనముగా నుండును. హిందూ దేశమున ననేక చోట్ల ననేక విగ్రహములు పూజింపఁబడుచున్నవి. సింహముపైనెక్కి మహిషరూపముననున్న రాక్షసకళేబరమును త్రొక్కుచు వానిశిరస్సును ఖండించి చేతంబట్టుకొని కత్తిమున్నగు నాయుధములను పుర్రెలమాలికలను ధరించి వికృతరూపముతోనుండు స్త్రీవిగ్రహమును మహిషాసురమర్దినియని చెప్పి పూజించుచుందురు. అట్టి విగ్రహము నేల పూజింపవలెను? అని విచారించినచో పూర్వము మహిషాసురుఁడను రాక్షసుఁడుండెననియు, అతఁడు ప్రజల ననేకవిధముల బాధించుచుండ పార్వతి వికృతరూపమును దాల్చి యారాక్షసుని జంపినటుల ననేకగ్రంథములవలనం దెలియును. కాని దాని యంతరార్థము వేఱుగానుండును. మహిషాసురుఁడనగా క్రూరత్వము, మూర్ఖత్వము, సింహమనఁగా పరాక్రమము. పుర్రెలమాలికయనగా జ్ఞానసముదాయము. ఇట్టి విగ్రహమును పూజించుటవలన మనపూర్వులు, క్రూర మూర్ఖస్వభావముల నడఁగద్రొక్కి పరాక్రమవంతులై జ్ఞానమును హృదయమునం దిడుకొని దేశధర్మమును కత్తితో కాపాడుకొనుటకు సిద్ధముగానుండవలయు పూజింపఁబడుచురని తెలియుచున్నది.

ఈరీతిగ ననేకవిషయములను బోధించుటకై శిల్పులనేక విగ్రహములను

నిర్మించుచున్నారు. కావుననే శిల్పమునకంటె బోధనసాధనమును శిల్పికంటె బోధకుడును లేడని తెలియుచున్నది. కావుననే శిల్పిని లోకగురువందురు. దేవశిలావిగ్రహములను నిర్మించి వానిని లోకులారాధించుటకైయొసంగువారు దేవశిల్పు లనంబడుదురు. ప్రపంచమునం దనేక జాతి మతములున్నను శిల్పమును, వృత్తిగా గొనువారు శిల్పు లనంబడుదురు. ప్రపంచమునం దనేక దేశములకంటె హిందూదేశమున దేవాలయములును దేవశిలావిగ్రహములును మిక్కుటముగా నుండుటవలన హిందూదేశమున దేవశిల్పు లధికముగా గలరని చెప్పవచ్చును. కాశీ మున్నగు దివ్యప్రదేశములయందును సాధారణముగా ప్రతి గ్రామమునందును జరుగు దేవతాపూజ లన్నియు శిల్పమునకే జరుగుచున్నవనియు చెప్పవచ్చును. నేటివఱకును పూర్వాచారముగ శిల్పమునే కులవృత్తిగా నెంచి సాధ్యసాధనము లనంబడు కృషి వాణిజ్య దాస్యముల నంటకుండు విశ్వబ్రాహ్మణు లేల పూజింపంబడరు? వర్షముతోడం బనిలేక మేఘమును చూచి సంతసించు మయూరములవలె, శిల్పమున నేమో యెఱుగక శిల్పినామమునకుమాత్రముబ్బి తబ్బిబ్బులగుటయే కారణము.

విశ్వబ్రాహ్మణులారా!

ఒక్కసారి తలయెత్తి దివ్యదృష్టి నుపయోగింపుడు! ప్రపంచకనాటకమును మనోహరముగా నడుపుటకును, ఈశ్వరభక్తిని బోధించి ప్రజలను భక్తితత్పరులగునటులఁ జేయుటకును శిల్పముకంటె వేఱొండు సాధనముగలదా? అట్టిశిల్పమును పరంపరాభిమాన విద్యగా నెంచి సృష్టికర్తలమని చెప్పను అరకాసు చెయ్యని అగ్నిపుల్లలను జూచి యుద్భ్రమమొందవలసిన వారుగా నున్నారు. ఇట్లుండ శిల్పి గౌరవార్హుఁడుగా నుండునా? మీనామములయందును నేటివఱకును. శిల్పనైపుణ్యమును ప్రకటించు ఆర్యగర్వము ప్రసరించుచునే యున్నది. మహాస్థలములయందలి దివ్యకట్టడములు మీనైపుణ్యముయొక్క పూర్వోన్నతదశను ప్రకటించి ప్రస్తుతస్థితి నామమాత్రావశిష్టమని తెలుపుచున్నది. హిందూశిల్పమును పూర్వోన్నత దశకుఁ దెచ్చు కాలము సమీపించుచున్నది. అజ్ఞానాంధకారమున మునింగియున్న మీహృదయసీమల జ్ఞానసూర్యుఁడుదయింపఁబోవుచున్నాఁడు. దేశము

సీ॥ వేదవేదాంతముల్ సాగరీతివచింప వైదికలోకవంక వరలుచుండ
నాంధ్రగీర్వాణముల్ హస్తామలకమైన బండితులోకదేశ బరిఢవిల్ల
నవరసాలంకారకవితా ప్రవేశలో కవిబృందమొక్కప్రక్కే వగడలుకొనగ
నానాజగంబునయట్టి పలుభాషావిదుల్ చేరి యొక్కచోట జెలగుచుండ

గీ॥ చిత్రతరయంత్రముల జేయు శిల్పశాస్త్ర
వేత్తలు మతొక్క చాయను వెలయుచుండ
ప్రథిత కొల్లూరుపురమున బొరుషేయు
లుండు సభజూడ కన్నుల పండుగయ్యె.

---

(పులికొండ పరబ్రహ్మముగారు.)

శా॥ విశ్వాసస్థితి లోకముల్ రచనగావింపంగ హింసింపగా
శశ్వద్దీప్తిని వెంపగాగలుగు భాస్వన్మూర్తివై మించు నో
విశ్వబ్రహ్మమ! దీర్ఘకాలమును బృద్ధిన్ వృద్ధిగాజేయు మా
విశ్వబ్రాహ్మణబాలసంఘమును నా వృధ్వీందుసూర్యంబుగాన్.

ఉ॥ ఒక్కడు పల్కువల్క మతియొక్కడు నీయధికత్వమేమి యం
చుక్కనునాదరింపడు అహో! మనవర్ణపు నైకమత్య మీ
ఛక్కి వెలుంగుచుండె నిటువంటి జనావళిగూడజేయుటే
యొక్క విశేషకార్యమిటులొప్పటలల్పమె వీరిబుద్ధియున్.

సీ॥ ఏవంకగనుగొన్న నావంక లెక్కరుల్ కాగితమ్ముల వ్రాయగడగువారు
ఎచటనుగనుగొన్న నచట సంఘమునకై దగకొంతధనమీయ దలచువారు
ఏరొజగనుగొన్న నారొజ నాశువుగ నుపన్యసింపగా గడగువారు
ఏచోటగనుగొన్న నాచోటసంఘముకై కొంతపనిచేయ గడగువారు

నైరికొల్లూరుసభయందు బౌరుషేయు
లౌర! యిట్లుండవలెగాదె! నైకమత్య

మనఁగ, నిట్టులైనభల నింకను నొనర్చు
చుండ, మేలగుఁ గాదె! యీ సుకృతులార.

ఉ॥ ఎచ్చటఁ జూడఁ బండిత గణేరిత వాక్యవితానమే కనన్
సచ్చరితాగ్రగణ్య బుధ సంఘమె కన్పడు నేడ గాంచ నిం
కెచ్చటఁ గన్గొనన్ సుజనబృందము లెక్చరులందుఁ గల్గి ర
త్యుచ్చయమాధురీగరిమ మొప్పను, చెప్పఁగ శక్యమే! బళా!

సీ॥ అగ్రాసనాధిపత్యము వహించిన మేటి సుకృతమ్ము నెలకొన్న సూరివరుడు
తివిరి సంఘాభివృద్ధికి పాటుపడి మహాశయత దీర్పులు దీర్చు శాస్త్రిచయము
సంఘోన్నతోద్యమ స్ఫారతఁ బని చేయువారు ధీనిష్ణాత వందనీయు
లరయ నింకను నుపన్యాసాదులనొసంగు హెచ్చరికలు నెల్ల సచ్చరిత్రు

లింక నీసభ్యులెల్ల సమీడుతులై య
గుదురు, మనసంఘమెల్ల కోవిద సుసంఘ
మగును, శ్రీవిశ్వకర్మ దీర్ఘాయువొసఁగి
సంతతము బ్రోచు నీ బాలసంఘవరుల.

---

# రజస్వలానంతర వివాహములు - బిల్లు.

:○.

పూర్వ మొకప్పుడు రజస్వలానంతర వివాహములు జరుగుచుండెడి వనియు కాలక్రమమున లేకుండుట సంభవించినను ప్రస్తుతము కొందఱు చేయుచున్నారనియు, అట్టివారి సంతానము కులటా సంతానముగా నెంచఁబడక పూర్వసంబంధమగు యాస్తి మున్నగు వానియందు పూర్ణముగ హక్కు కలిగియుండవలయుననియు భావము. బిల్లు అమలులో పెట్టుటకు కోరఁబడుచున్నది.

దీనిని కొంద ఱామోదింపఁదగినదనియు కొంద ఱామోదింపఁ దగనిదని యు ననుచున్నారు. అయితే వివాహమన నేమో అందున కర్త లెవ్వరో విచారించినయెడల దీని యావశ్యకత తేటపడగలదు.

ప్రపంచమున స్త్రీపురుషులను రెండుజాతులుగలవు. ప్రజాభివృద్ధిని చేయుటయందివి రెండును సమానశక్తిను కలిగియున్నవి. ఇవి రెండును శుక్రశోణితముల సమ్మేళనముచే జనించి విజృంభించి ఒకటి శుక్రమునకును మఱియొకటి శోణితమునకును ప్రధానమై మరల సంయోగమున కియ్యకొనుచున్నవి. ప్రపంచమునందలి సమస్తజీవులు జననకారణమునందును శరీర నిర్మాణమునందును, ఆహార విహారములయందును అంతగా భేదము కలిగియుండవుగాని మనుజుల శరీరమునందు జ్ఞానమున కాధారమగుమజ్జాతంతువులధికముగానుండును. కావున మనుజులు సమస్తధర్మాధర్మముల నెఱుఁగదగియుందురు. మనుజుఁడు జనించిన తరువాత కొలదికాలములోనే తల్లిని గుర్తింపఁగలడు, తల్లియైనను మఱి యేస్త్రీయైనను పాలిచ్చి పెంచుటవలన నెఱుగ గలడు. తుదకు కామశాంతికై యేస్త్రీనైనను కోరగలడు. అట్టిమనుజుడు పలుకాంతలతో గలియుటవలన ముఖ్యముగ మజ్జాతంతువులు శోషించి జ్ఞానశూన్యుఁడై పశుత్వము నొందును. బుద్ధిమంతులగు మనుజులు జ్ఞానమును నిలుపుకొనుటకై శుక్రమును కాపాడుకొనవలయునని మొట్టమొదట గ్రహించిరి. ఈధర్మమును యువకులకు బాగుగ బోధించిరి. కొందరు బాలురను వనవాసమున విద్యాబుద్ధులుగఱపి దీక్షాపరులుగఁజేసిరి. అందువలన యువకులు తేజస్సు, ఓజస్సు, బుద్ధి, పరాక్రమము, శీలముగలవారైరి. ఇది బ్రహ్మచర్యవ్రతము. ఈవ్రతము వలన నందవలసిన ఫలమునంది వారికి దగులీల దయారుచేయఁబడిన కన్యలను గూర్చి ప్రేమానుబంధమును తగువిధులతో నేర్పఱచిరి. అదియే వివాహము. ఇందువలన పురుషు డొకస్త్రీని స్త్రీ యొకపురుషునిమాత్రము కలిగియుండవలయునని తెలియుచున్నది. అందువలన జ్ఞాననాడులంత గాశోషించకుండును. జ్ఞానమును నిలుపుకొనుటకై వివాహము నేర్పఱచిరని తెలియుచున్నది. వివాహము అన్ని దేశములయందును ప్రతిమనుజునకువిధిగానున్నది. ఇతరదేశములయందు 15,20 సంవత్సర

ములవయస్సుగల కన్యలుండరు. మన దేశమున పూర్వకాలమున కొందఱు స్త్రీలు పురుషులవలెనే జీవితాంతమువఱకు బ్రహ్మచర్యమునే బూని లోకులకు జ్ఞానోపదేశము చేయుచుండినటుల దృష్టాంతములు గలవు. ప్రస్తుత మట్లులేదు. స్త్రీలకు 12 సం॥ వయస్సువచ్చువఱకు తప్పక వివాహములు జరుగుచున్నవి. కన్యగాని వరుడుగాని తామెవరి ప్రేమాపాశములచే గట్టఁబడుచున్నారో తామెఱిఁగియుండుట లేదు. అందువలన దంపతు లత్యంత ప్రేమానురాగము గలిగియుండుటకు మారుగా ననేకులు ద్వేషముకలిగియున్నారు. ఇంతమాత్రమున తల్లిదండ్రులు లోనగువారు దాంపత్యము కేవల మనర్థమని చెప్పుటగాదు. అయితే ప్రస్తుతము వివాహములు పూర్వపుపద్ధతిని జరుపఁబడుట లేదు. పూర్వము కన్యాసంబంధీకులగువారును వరుని మిత్రులును మారువేషములతోపోయి కన్యావరుల స్వభావమును బాగుగా పోల్చి అనుకూల ప్రతికూలములను గ్రహించి వివాహములను చేయుచుండెడివారు. ప్రస్తుత మట్టివిచారణ లేదు సరిగదా మిక్కిలి అననుకూల వివాహములు చేయుచున్నారు. ప్రస్తుతము చేయుచున్న వివాహకర్మలను చూచినను పూర్వ మొకప్పుడు రజస్వలానంతరమే వివాహములు చేయుచుండిరని స్పష్టముగఁ దెలియుచున్నది. కన్యావరశుల్కములు తల్లిదండ్రుల విధులను నాశనము చేయుచున్నవి. వివాహముయొక్క ధర్మమంతయు వధూవరుల ప్రేమాసంబంధము గావున బాలికలకు యుక్తవయస్సువచ్చి వరులయందు తమ ప్రేమాసంబంధమున కనువగు లక్షణములు గలవో లేవో గ్రహించుట కవకాశముండవలయును. గావున నిజముగా రజస్వలానంతరమే వివాహములు చేయవలయును.

కాలవశమున నగ్రజాతులకు రజస్వలానంతర వివాహములు నింద్యములయ్యెను. అందులకుఁగల కారణమంతయు వర్ణించుట కిది సమయమైనను మన దేశమునకు కష్టకాలము సంభవించినప్పుడు బాల్యవివాహము లేర్పడెనని చెప్పినఁజాలును. దేశమున నవీనోద్యమ మంకురించి యభివృద్ధికై పాటుపడుచు బాల్యవివాహము లనర్థదాయకములని యన్నిసంఘము లేకగ్రీవముగ బలుకుచుండ రజస్వలానంతర వివాహపుబిల్లు తగదనుట యెంతయవివేకము! ఈ బిల్లు రజస్వ

లానంతర వివాహము నిర్బంధమని చెప్పుటలేదు. ఇష్టమయిన రజస్వలానంతర వివాహము చేసికొనినవారి సంతతికి పూర్వసంబంధముగ ఆస్తిని చెంద వచ్చుననుట. రజస్వలానంతరవివాహ మశాస్త్రీయ మయినను శాస్త్రీయమయినను బిల్లువలన మన పూర్వాచారమునకు భంగములేదు. కావున దీని నామోదించుట ముఖ్యము.

---

# స్త్రీవిద్య.

(సప్తమమహాజనసభలో పులికొండపరబ్రహ్మముగారి యుపన్యాసము)

విద్వన్నిధులారా! స్త్రీవిద్యాభిమానులారా!

వర్తమానకాలమున స్త్రీవిద్య బహు క్షీణదశలోనుండి కుందుచున్నది. దీనికంతకు గారణము మనలోనుండు కొందఱు పెద్దవాండ్ర మూఢత్వమేయని చెప్పవచ్చును. ఏమందురా! స్త్రీలకు విద్యజెప్పుటవలన ననర్థములు కలుగుననియు, గృహకృత్యములకు భంగము సంభవించుననియు, భర్తలయం దిందుకేని లక్ష్యముంచరనియు, కొరగాని పనుల చెప్పుదురనియు, అంగనలు విద్యనేర్చి యుద్యోగములు సేయుదురాయనియు, పలువురు పలువిధములగు సందియములనుండి మరలకున్నారు. లోకమున విద్యనేర్చి జ్ఞానమును సంపాదించుట ధనము సంపాదించుటకేయని వీరి యూహలు! యువతుల కింటియందే గొప్ప యుద్యోగమున్నదని వీరెఱుంగరు కాబోలు. ఆహా! యన్నలారా! యేమి వీరి యజ్ఞానము, భర్తకు సకల సౌఖ్యములు కలిగించి తాను సుఖపడుటయు, కన్నబిడ్డలను చక్కగా పెంచి వారికి విద్యాబుద్ధులు గరపి సత్ప్రవర్తనలోనికి దెచ్చుటయు, గృహకృత్యములు చక్కగా నిర్వర్తించుట, నింతకన్న నేయుద్యోగ మేమి కావలయునో! నీయుద్యోగమును జేయుట కంగనలకు విద్య యెంత యావ

శ్యకమో యోజింపుడు! బాల్యమునందు కన్నతల్లులవలన సంస్కారములందుం
చబడక, పెద్దలైనపిమ్మట బుద్ధులు మారక చెడినబాలు రెందరులేరు యిట్టి
యనర్థములు మాపుటకు స్త్రీవిద్య యెంతో యావశ్యకము; ఒక్కయంగనకు విద్య
జెప్పుటవలన కుటుంబమునం దెంతవరకు విద్యావాసన ప్రబలునో యోజింపు
డు విద్యాగంధముగల యంగనలు గృహకృత్యముల మరింత తెలివితోడను జా
గ్రతతోడను నిపుణముగాను జేయగలుగుదురు; భర్త కనేకవిధముల సహాయు
లగుదురు. ఇంక యంగనల దుర్వృత్తులలోనికి దింపునట్టి విద్య యెట్టిది? వ
చ్చియురాని యక్షరములతో విటులకు నాలుగుమాటలజాబు వ్రాయగలిగినం
తవరకు జెప్పించి యటుపిమ్మట కోలాటము శృంగారపదములు యభినయము
నేర్పి పైన హంసవింశతి తారాశశాంకవిజయము మొదలగు గ్రంథముల జది
వించుటవలన గుణములుమారి వింతసాహసము లొనర్చుటకును సాహసికు లగు
దురు. అట్టివిద్య జెప్పించుటకంటె యూరకుండుటయే కొంతమేలు. వివే
కజ్ఞానముల వృద్ధిపఱచు సద్విద్యవలన చెడ్డవారికిగూడ మంచిగుణము రాగలుగు
ను. కావున మన స్త్రీలకు వినయము వివేకము, కరుణ, జాగ్రత, పాతివ్రత్య
ము, శీలము, వీనిని యభివృద్ధిపఱచుటకు విద్యయేకదా మూలకారణము. మ
నయువతులకు సుగుణసంపద వృద్ధిగావలెనన్న విద్యయేకదా ప్రధానబీజము
అంగనలయొక్క మార్దవత్వముగల మాటలయందు మరింత మధురిమ గలుగు
టకును వారల ప్రేముడియే మనకు మరింత ప్రియముగా నుండుటకును వారల
స్నేహమే మరింత హృదయాహ్లాదకరముగా నుండుటకును, వారి సౌందర్యమె
యొక తియ్యందనముగా నుండుటకును వారిస్వరూపమే యొక పెన్నిధానము
గను మధురప్రవాహముగ దోచుటకును విద్యయేకదా ప్రధానసాధనము. కొంద
ఱుస్త్రీలు మూఢాచారములం బ్రవేశించి భర్తలకు సుఖము కలిగించుటకుమారుగా
దుఃఖము కలిగించుచు సదా విచారనిమగ్నులగా జేయుచున్నారు. విద్యా
విహీనతచేతనే కదా? గృహకృత్యముల సౌకుమార్యముగ జేయుటచేత
గాక, బిడ్డలను బాగుచేయుట తెలియక సంసారమును బాడుచేయుచున్నారు.
విద్య నెఱుంగకపోవుటచేతనేకదా అల్పబుద్ధి సమేతలై మాటిమాటి కొం
డెగలతో పోట్లాడికొనుచు గృహమర్మముల బైటబుచ్చుచు, భర్తత వహించి

గృహా మరణ్యముగ జేయుచున్నారు. విద్య లేకపోవుటవలననే కదా సంసారమున గల కష్టసుఖముల మంచిచెడ్డల నెఱుంగక తమ బిడ్డలకు మంచి యుడుపులు నగలు కావలెనని మగల బాధించుచున్నారు. మన స్త్రీలకు పూర్ణముగ విద్యయే యుండినయెడల, నిట్టి యనర్థములు యిట్టి దురాచారములు యిట్టి దుఃఖభాజనములు యిట్టి గర్హ్యసంగతులు యిట్టి హేయకార్యములు యిట్టి యల్పస్థితులు, ఘాతపడవే! పంచబంగాళములు కావే! దూరగతులు గాకుండునే స్మరణకు మరపు గలిగింపవే! అయ్యలారా విచారింపుడు.

పూర్వము మనదేశమందలి స్త్రీలలో గొందఱు విద్వాంసురాండ్రున్నారని మనము వినుచున్నాము. కొందఱు పెద్దపెద్ద గ్రంథములగూడ రచించిరనియు వినియున్నాము. వాటినిగూడ కొన్నిటి మనము జూచుచున్నాము. యూరపు, అమెరికా, దేశములందలి స్త్రీలు సాధారణముగా విద్యనేర్చినవారుగా నున్నారు, ఆయాదేశములలో స్త్రీవిద్యాభివృద్ధి చాలా ప్రబలముగా నున్నది. యిప్పుడు మనదేశమందలి స్త్రీలలో సుమారు వందకు పదిమందియైనను చదువుకున్నవారు గారని నా యాశయము. ఇట్టి స్థితిలో విద్వాంసురాండ్రనుటకు ఊరక నోటిసంఖ్యనే వెదకి చెప్పవచ్చును. యిట్టివారు బొంబయి, కలకత్తా, ప్రసిడెన్సీలలో మెండుగానున్నారని విందుముగాని మన మద్రాసు ప్రసిడెన్సీలో నంత విరివిగా లేరు. స్త్రీలకు పూర్ణముగా విద్య నేర్పినయెడల పాశ్చాత్య స్త్రీలవలె, పురుషుల నెదిరించి పురుషులు మాకు లోబడి యుండవలెను. మాకుగూడ నధికారము పురుషులతోపాటు గలుగవలెను, మేము పెండ్లియాడము, అనునట్టుల శ్రుతికిమించుదురని కొందఱు సందేహింపవచ్చును.

గృహస్థధర్మములు బాగుగా విచారించినయెడల నిట్టిభేదబుద్ధులకు మార్గము గోచరింపదని నొక్కి పలుకవచ్చును. స్త్రీలకు నొక్కటియేయగుబుద్ధిని బోధనజేయుచు మెండగు మర్యాదలం జూపుచు నాదరించినయెడల భర్తలయందు భక్తిశ్రద్ధాదు లభివృద్ధి గాంచును అన్యోన్యప్రేమ కామరతంబగును. వానికి భయమునొపకుండ జేయువలయును భయరజ్జువులచే బంధింపబడినవా,

రియుండుండు సద్గుణములు చెల్లాచెదరగుటగాక దుర్గుణప్రవేశమునకు ద్వారముగు మార్గము సిద్ధపడుచున్నవి. భయరజ్జువులు బలరోగములు గనుక నమ్మరానివి మోసముజేయును. ప్రేమభక్తి రజ్జువులన్ననో ప్రతిదిన ప్రవృద్ధములై బలవాధిక్యముతో గూడియుండును పరస్పరానురాగమును వృద్ధిజెందించుచుండును. అట్టి దంపతులుగల గృహమే జయప్రదముగా మంగళాతిశయమై వర్థిల్లును. అట్టిచోటనే గృహస్థధర్మము గాపాడబడుచు, అట్టిస్థలముననే విద్యాలక్ష్మి దినదినప్రవర్ధమానమై బంగారపు టుయ్యాలలో నూగుచుండును.

ఈ పైనజెప్పిన విషయములం దేమాత్రము నతిశయోక్తి లేదు. ఈ దేశమును వృద్ధిగావింపవలెనన్న స్త్రీవిద్యయే ప్రథమ సోపానములని యందఱు నంగీకరించియున్నారు. కొందఱీ హీనస్థితి యెప్పుడు మాయమగునా యని యెదురుజూచుచున్నారు. కొందఱు విద్వాంసు లీకొఱతదీర్చుట కనేక ప్రయత్నములు చేయుచున్నారు. కొందఱు మూఢులగు తమ భార్యలకు విద్యనేర్ప యత్నించియు విఫలమనోరథులయి యుండుచున్నారు. కొందఱు గృహసౌఖ్యములు లేక; సత్కార్యముల జేయజాలక మతిచెడి క్రుందుచున్నారు. కొందఱు తమ భార్యలకును తమకును కలియక సదా విచారసముద్రమగ్నులై కలగుచున్నారు. దీనికంతకు స్త్రీవిద్యాహీనతయే కదా కారణము. తండ్రులారా! ఇన్నిసంగతులు కన్నులార గాంచుచుండియు మీకన్నబిడ్డలకేల విద్యజెప్పించరు. ఏల సౌఖ్యపడజేయరు, ఏలగౌరవము బొందనీయరు ఏల వృద్ధిజెందనీయరు.

సాంఘికులారా! మనము బాగుపడుటకుగల సాధనములలో స్త్రీల నుద్ధరించుట ప్రధానచరణము దాని నభివృద్ధిగావింపుడు. మన చిన్నకన్నెలు సావిత్రివంటివారలుగా నగునట్లుజేయుడు. ఆవిషయమై విశ్వకర్మను ప్రార్థింపుడు. ఇట్లుండిన యెడల మనసంఘము చాల యభివృద్ధిగాంచుననియు, కళావంత మగుననియు సద్యశోభరిత మగుననియు నామతమగుటచే నిట్లు గాంచుదురుగాక యని మీకందఱ కనేక నమస్కారము లాచరింపుచు నింతటితో విరమింప ననుజ్ఞ వేడుకొనుచున్నాడను.

# గిల్టుదమ్మిడీ

———(౦)———

సూరమ్మయను స్నేహితురాలు చిత్ర చిత్రములగు నగలను పెట్టుకొని, తళుకు బెళుకు బట్టలను గట్టుకొని రామమ్మను జూడవచ్చెను. రామమ్మ బీద కుటుంబమున బుట్టిన చిన్నది. గోనెపట్ట నొకదానిని వేసి దానిపైన సూరమ్మను గూర్చుండుమనెను. సూరమ్మయు ధనికులబిడ్డ కాదు; ఇప్పటి తన వేషముతో గోనెపై గూర్చుండుటకు నిష్టపడకుండెను. రామమ్మ యీసంగతి గనిపెట్టి యూరకున్నది. ఆమె స్నేహితురాలు మరలిపోయెను.

చిన్నవారలు స్నేహితులను విడిచి చాలసేపుండజాలరు. కావున సూరమ్మ కొంచెము సేపటికే తిరిగివచ్చెను. ఇప్పుడు తన తళుకు బెళుకు గుడ్డలను దీసివేసి యెప్పటివలె సామాన్యపు వేషముతో వచ్చినది. రామమ్మ స్నేహితురాలిని జూడగానె దగ్గఱకుపోయి కౌగలించుకొని యాటలాడుకొనుటకు దీసికొనిపోయెను. "ఇందాక నేను వచ్చినప్పుడు మాటలాడకపోతివేమే?" అని సూరమ్మ రామమ్మ నడిగినది. "ఇందాక నీవు గిల్టుదమ్మిడీ వైతివిగా!" యని రామమ్మ పలికెను. గిల్టుదమ్మిడీ యేమిటో చెప్పుమని సూరమ్మ యడుగగా రామమ్మ తనతండ్రియిచ్చిన గిల్టుదమ్మిడీ నొకదానిని తెచ్చి చూపుచు ఇట్లు చెప్పినది.

"ఈదమ్మిడీ గిల్టువేసిన దమ్మిడీ. తళుకు తళుకుమనుటేగాని యిది బంగారుకాసు గాదు. విలువ మారలేదు; కాని ఉపయోగము లేకుండబోయినది. దీనితో దేనిని కొనగూడదట. దీని నంగడిలో మార్చినయెడల దొరతనమువారు శిక్షింతురట. ఇట్లే నీ తళుకు బెళుకు వేషమువలన మన స్నేహము హెచ్చలేదు. ఎప్పటివలె కలిసిమెలిసి యాడుకొనుటకు నామన సొప్పలేదు. నీబట్టలు, వేషము చెడునని నీవును సందేహించితివి."

ఈమాటలను వినిన సూరమ్మ పకపక నవ్వుచు జాల సంతోషించినది. అప్పటినుండియు తమకు మించిన వేషముల వేసినవారిని వారు గిల్టుదమ్మిడీలని పిలువ మొదలుపెట్టిరి.

———:౦:———

# పూర్వస్థితిమఱవదగదు.

అరేబియాదేశమందొక సామంతరాజు తానెప్పటికి బోయినను వెంట నొక చందువాపెట్టెను దీసికొనిపోవుచుండెడివాడు. దాని నెవ్వరును తన దృష్టినుండి తొలగనిచ్చెడివాడు కాడు. దాని నొక లొట్టిపిట్టమీద నుంచుకొని పోవుచుండును. దీనిని గనిపెట్టిన మంత్రులు కొందఱు ఆపెట్టెలో రాజద్రోహపు టుత్తరము లుండియుండుననియు; వానిని వెల్లడిచేసినయెడల ఆసామంతరాజు దుర్మార్గము బయలుపడుననియు తలచిరి. రాజుతో తమ యనుమానమును గూర్చిచెప్పిరి.

రాజు తత్క్షణ మా సామంతరాజును బిలిపించెను. ఎప్పటియట్ల వానితో చందువాపెట్టెను మోసుకొని పోవుచుండు ఒంటెయు వచ్చినది. వెంటనే ఆపెట్టెను తెఱువుమని రాజు ఉత్తరువుచేసినాడు. సామంతరాజు తాళముచెవిని బైకిదీసి నెమ్మదిగా పెట్టెను దెఱచినాడు. మంత్రులును, రాజును ఆపెట్టె చుట్టునుజేఱి దానిలో నేముండెనోయని ఆతురతతో చూడసాగిరి. దూరమునను ండి కొందఱు పాపమా సామంతరాజున కేమిమూడునోయని విచారింపుచుండిరి.

ఆపెట్టెయందొక కంబళిమాత్ర మున్నది. మంత్రులు తమయూహ పొరబాటని సిగ్గుపడిరి. రాజునకు వింతగనుండెను. "ఈకంబళిని నీవు ఎల్లప్పుడును పెట్టెలో బెట్టుకొని వెంటదీసికొని పోనేల?" అని రాజడిగెను.

"మహాప్రభూ! నేను మొదట నొక గొఱ్ఱెలకాపరిని. నా వినయము వలనను, న్యాయవర్తనము వలనను, తెలివి వలనను, మీ యనుగ్రహము వలనను, గొప్పపదవికి వచ్చినాను. నా పూర్వస్థితిని మఱచితినేని నాకు గర్వము పుట్టును. అందుచేత సర్వమును చెడుమార్గమును బట్టును. నా మొదటిస్థితి జ్ఞాపక ముంచుటకు నే నిట్లుచేయుచున్నాను" అని సామంతరాజు జవాబుచెప్పెను.

రాజు వానిని మెచ్చుకొని గొప్ప బహుమానముల నొసగిపంపెను.

ఆ॥ వృ. యస్మిన్క్షేత్రోద్దేశే జాతం
సస్యం వినాశ ముపయాతి।
స్నిగ్ధమతి పాండరం వా
మహాసిరానరయుగేత్ర॥ ॥౬౧॥

అ॥ ఏప్రదేశంబున పైరుబెట్టిన చుట్టునుండు పైరు చక్కగానుండి మధ్యయొకచోటమాత్రము పైరు ఎండిపోయినను, తెల్లబారినను, మిగుల కోమలంబై యున్నను, నచట రెండుపురుషుల ప్రమాణము త్రవ్విన మిగుల నుదకంబు ప్రవహించు గొప్ప జలనాడియుండు.

ఆ॥ వృ. మరుదేశే భవతి సిరా
20 యథా తథాంతః పరంవక్ష్యే।
కంఠేషూష్ట్రాణామివ భూ
తల సంస్థాస్సిరాయాంతి ॥౬౨॥

అ॥ ఇక * మరుప్రదేశములయందుండు జలనాడులను వచించెద నెట్లనిన; అత్యున్నతంబులగు ఒంటెమెడకు జలంబులు ప్రసరించుభంగి మరుభూములయందు జలనాడులు పోవుచు నచ్చుచుండు.

ఆ॥ వృ. పూర్వోత్తరేణపీలో
21 ర్యదివల్మీకో జలంభవతి పశ్చాత్ ।
ఉత్తరగమనాచవిసిరా
జ్ఞేయా పంచభిఃపురుషైః ॥౬౩॥
చిహ్నందర్దురమాదౌ
మృత్కపిలాతత్పరంభవేద్ధరితా ।

---

* మరుప్రదేశంబులనగా ఎన్నటికి జలంబు సంభవించకుండునవి ఇవే ఊషరారణ్య భూములని వ్యవహరింపబడును.

భవతి చ పురుషార్ధోశ్మా
తస్యతలే వారిని ర్దేశ్యమ్ ॥౬౪॥

అ॥ మరుప్రదేశమునందలి కారుగోగుచెట్టున కీశాన్యదిశయందు పుట్టయుండెనేని నాపుట్టకు వాయవ్యదిశయందు నైదుపురుషుల ప్రమాణము ద్రవ్వినజలంబుండు. అందుముందట నొకశిప్పయు, నాక్రింద నల్లమట్టియు, నాక్రింద పచ్చమట్టియు, దానిక్రింద నొకపురుషప్రమాణమున ఱాయియు, నాక్రింద జలంబును నుండు.

22 ఆ॥వ్య. పీలోరేవప్రాచ్యాంవల్మీ
కోఽతోఽర్ధపంచమైర్హస్తైః
దిశియామ్యాయాం తోయం
వక్తవ్యం సప్తభిః పురుషైః ॥౬౫॥
ప్రథమే పురుషే భుజగస్సితా
సితో హస్తమాత్రమూర్తిశ్చ
దక్షిణతో వహతిసిరా
సక్షారం భూరి పానీయమ్ ॥౬౬॥

ఆ॥ మరుప్రదేశంబునందలి గోగుచెట్టు నికటంబున పుట్టయుండెనేని దానికి దక్షిణదిశయందు నైదున్నరమూరదూరంబున నేడుపురుషుల ప్రమాణముద్రవ్విన జలంబుండు. అందొక పురుషప్రమాణంబున నొక మూర పొడవుగలిగి తెలుపు నలుపు వర్ణంబుగల సర్పంబును నుండుటయేగాక నాక్రింద నెన్నటికి శోషింపని దక్షిణదిశనుండి ప్రవహించెడి జలనాడియును, జలంబును నుప్పగనుండు.

24 ఆ॥వృ. ఉత్తర తశ్చకరీరే
అహేర్గృహాం దక్షిణే జలంజ్ఞేయం
దశభిః పురుషైర్జ్ఞేయం
పురుషే పీతో త్ర మండూకః ॥౬౭॥

అ॥ మరుప్రదేశమునందలి వెణుతురుచెట్టునకు త్తరదిశయందు పుట్టయుండెనేని దానికి మూడుమూరల దూరమున పదిపురుషుల ప్రమాణము ద్రవ్విన దక్షిణదిశనుండి ప్రవహించెడి జలనాడియుండు. అందాక పురుషప్రమాణంబున పచ్చని కప్పయుండును.

25 ఆ॥వృ. రోహితకస్యపశ్చాదహివా
సచ్ఛే త్రిభిః కరైర్యామ్యే
ద్వాదశ పురుషాన్ఖాత్వా
సక్షారా పశ్చిమేన సిరా ॥౬౮॥

అ మరుప్రదేశమునందలి ములుమోదుగు చెట్టునకు పడమటి దిక్కుయందు పుట్టయుండెనేని దానికి దక్షిణంబున మూడుమూరలదూరంబున పంద్రెండుపురుషుల ప్రమాణంబుద్రవ్విన నదు పశ్చిమదిశనుండి ప్రవహించెడి జలనాడియుండు.

26 ఆ॥వృ. ఇంద్రతరోర్వల్మీకః
ప్రాగ్దృశ్యః పశ్చిమేసిరాహస్తే
ఖాత్వా చతుర్దశనరా
న్కపిలా గోధాన రే ప్రథమే ॥౬౯॥

అ॥ మరుప్రదేశమునందలి మద్దిచెట్టునకు తూర్పుదిశయందు పుట్ట యుండెనేని దానికిపశ్చిమదిశయందొక మూరదూరంబున చతుర్దశపు

రుష ప్రమాణముద్రవ్విన జలంబుండు. అందొక పురుష ప్రమాణమున పడమటిదిశనుండి ప్రవహించెడి జలనాడి యుండు. మఱియు కపిలవర్ణముగల ఉడుముండును.

ఆ॥వృ. యదివాసువర్ణనామ స్తరో
ర్భవేద్వామతో భుజంగగృహమ్
హస్తద్వయేతు యామ్యే
పంచదశ నరావసానేంబు ॥౭౦॥

క్షారం పయోత్రనకులో
ద్వ్యామానవే తామ్రసన్నిభశ్చాశ్మా
రక్తాచ భవతి వసుధా
వహతిసిరా దక్షిణా తత్ర॥ ౭౧॥

ఆ॥మరుప్రదేశమునందలి యుమ్మెత్తచెట్టున కుత్తరదిశయందు పుట్టయుండెనేని దానికి దక్షిణపార్శ్వమున రెండుమూరలదూరమున పదుయేనుపురుషుల ప్రమాణముద్రవ్విన దక్షిణదిశనుండి ప్రవహించెడియు పుష్కలముగల జలనాడియు నుండు. అందు రెండుపురుషుల ప్రమాణమున ముంగిసయు, దానిక్రింద నల్లని ఱాయియు, దానిక్రింద నెఱ్ఱని మట్టియునుండు.

29 ఆ॥వృ. బదరీ రోహితవృక్షౌ
సంపృక్తౌ చేద్వినాపి వల్మీకమ్
హస్తత్రయేతు పశ్చా
త్షోడశభి ర్మానవైరంభః ॥౭౨॥

30 సురసం జలమాదా
దక్షిణాసిరా ఉత్తరేణాన్యా
పిష్టనిభః పాషాణో
మృచ్ఛ్వేతా వృశ్చికోర్ధనరే ॥

అ॥ మరుప్రదేశమునందు ములుమోదుగు చెట్టును రేగుచెట్టునుగ లసియుండెనేని దానికి పశ్చిమ దిశయందు మూడుమూరల దూరమ్మున షోడశ పురుషప్రమాణముద్రవ్విన నందు దివ్యోదకంబు లుదయించు. అం దర్థపురుష ప్రమాణముననే పిండిఱాయియు, దానిక్రింద తెల్లని మట్టియు, దానిక్రింద తేలును, దానిక్రింద దక్షిణదిశనుండి ప్రవహించెడి జలనాడియు; ఉత్తరదిశనుండి ప్రవహించెడు రెండవ జలనాడియు నుండు.

ఆ॥వృ. నకరీరాచేద్బదర్యాభిః
కరైః పశ్చిమేన తత్రాంభః
అష్టాదశభిః పురుషైః
రైశానీబహుజలాచ సిరా ॥28॥

అ॥ మరుప్రదేశమున వెణుతురు వృక్షమును రేగుచెట్టును గల సియుండెనేని దానికి పశ్చిమదిశయందు మూడుమూరల దూరంబున (౧౮) పురుషుల ప్రమాణముద్రవ్విన నీశాన్యదిశనుండి ప్రవహింప జేయునదియును, మిగుల నుదకంబులు గలదియును నగు జలనాడి యుండు.

ఆ॥ వృ. సపలాశాచే ద్బదరీ
32 హస్తత్రియసమ్మితే దిశిప్రాచ్యామ్

వింశత్యా పురుషాణా
మశోష్య మంభోఽత్ర సత్త్వారమ్ ॥౭౫॥

అ॥ మరుప్రదేశమునందు మోదుగుచెట్టును రేగుచెట్టును గలిసి యుండిన దానికి తూర్పు దిశయందు మూడు మూరల దూరంబున (౨౦) పురుషుల ప్రమాణము త్రవ్విన నశోష్యంబగు నుదకంబు గల్గును.

33 ఆ॥వృ. కకుభకరీ రావేకత్ర
సంయుతౌ వాక కుభ బిల్వౌ
హస్తత్రయేతు పశ్చా
ద్భవేన్నరైః పంచవింశత్యా ॥౭౬॥

అ॥ మరుప్రదేశమునందు మద్దిచెట్టును, వెలుతురు చెట్టయినను లేక, మద్దిచెట్టు బిల్వచెట్టయినను గలసియుండెనేని దానికి బడమట మూడుమూరలదూరంబున (౨౫) పురుషుల ప్రమాణము త్రవ్విన జలంబుండును

34 ఆ॥వృ. వల్మీక మూర్ధనియదా
దూర్వాచకుశాశ్చ పాండరాస్సంతి
కూపో మధ్యేదేయో
జలమత్ర నరైక వింశత్యా ॥౭౭॥

అ॥ మరుప్రదేశమునందు పుట్టపై దర్భలను, గరికయైనను మొలచి తెల్లబారి యుండినయెడల (౨౧) పురుషులప్రమాణము త్రవ్విన నందు జలంబుండును.

35 ఆ॥వృ. భూమిః కదంబకయుతా
వల్మీకే దృశ్యతే యదామాగ్వా

హస్తద్వయే నయామ్యాం
నరై ర్జలం పంచవింశత్యా ॥౭౮॥

అ॥ కలిమిచెట్టు నికటంబున పుట్ట యుండెనేని దానికి తూర్పుదిక్కున రెండుమూరల దూరంబున (౨౫) పురుషుల ప్రమాణము త్రవ్విన దక్షిణదిశనుండి ప్రవహించెడి జలనాడి యుండు

36 ఆ॥వృ. వల్మీకత్రయమధ్యే
రోహితకః పాదపో భవేద్యత్ర
భవతిచ నానా వృక్షై
స్త్రిభిర్జలం తత్ర నిర్దేశ్యమ్ ॥౭౯॥

37 హస్తపతుష్కేనస్మా
త్షోడశభిశ్చాంగులైరుదగ్వారి
చత్వారింశత్పురుషా
న్ఖాత్వా ధాశ్మాసిరా భవతి ॥౮౦॥

అ॥ మూడుపుట్టల మధ్యంబున ములుమోదుగుచెట్టుగలిగి దాని చుట్టు ననేకవృక్షంబు లుండినను, లేక చెట్లయినను చుట్టంబడి యుండినను నవ్వృక్షంబున కుత్తరదిశయందు నాలుగుమూరలు పదియారంగుళంబులుదూరంబున (౪౦) పురుషుల ప్రమాణము త్రవ్విన నొక ఱాయియు దానిక్రింద నుత్తరదిశనుండి ప్రవహించెడి జలనాడియు నుండు.

38 ఆ॥వృ. గ్రంధిప్రచురాయస్మిన్ఛమీ
భవే దుత్తరేణ వల్మీకాత్
పశ్చా త్పంచకరాం తే
శతార్ధ సంఖ్యై ర్నరై స్సలిలం ॥౮౧॥

అ॥ మరుప్రదేశమునందలి పుట్టకు నుత్తరదిక్కున మిక్కిలి యుం డ్లుగల జమ్మిచెట్టు మొలచియుండెనేని నాచెట్టుకు పడమర ఐదుమూర లదూరంబున నేబది పురుషుల ప్రమాణము ద్రవ్విన జలంబుండు.

ఆ॥వృ. ఏకస్థాః పంచయదా
59 వల్మీకామధ్యతో భవేచ్ఛ్వేతా
తస్మిన్ సిరా ప్రదిష్టా
నర షష్ట్యా పంచవర్జితయా ॥౮౨॥

మరుప్రదేశమునందు నాలుగుపుట్ట లేకంబుగ నుండి వాటి మ ధ్యంబున తెల్లని పుట్టయుండెనేని నందు (౫౫) పురుషుల ప్ర మాణము ద్రవ్విన జలంబుండు.

ఆ॥వృ. సపలాశా యత్ర శమీ
60 పశ్చిమభాగేంబుమానవైః షష్ట్యా
అర్ధనరేతు ప్రథమం
సవాలుకాపీత మృత్పరతః ॥౮౩॥

అ॥ మరుప్రదేశంబున రేగుచెట్టు మోదుగుచెట్టు గలసియుండె నేని దానికి పశ్చిమదిశయందు (౬౦) పురుషుల ప్రమాణము ద్రవ్విన నందు జలంబుండు. అం దర్ధపురుష ప్రమాణంబున నిసుకయు, దాని క్రింద పచ్చని మట్టియు నుండును.

ఆ॥వృ. వల్మీకేనతుపరతో
61 శ్వేతో రోహీతకో భవే ద్యస్మిన్
పూర్వేతు హస్తమాత్రే
సప్తత్యా మానవైరంభః ॥౮౪॥

# కీర్తిశేషులగు గోక్లే.

ఇపుడిపుడే జ్ఞానసూర్యుం డుదయింపగా గన్నులు విప్పి యభివృద్ధికై పోటుపడుచున్న ఆర్యావర్తమున మిట్టమధ్యాహ్నమున సూర్యు డస్తమించినటుల నున్నది. దేశాభివృద్ధికిని మనుజుల జ్ఞానాభివృద్ధికిని అత్యావశ్యకమైనదివిద్య. విద్య నభివృద్ధిజేయుట కెన్నియో మార్గములుగలవు. అన్నిటికంటె నిర్బంధమువలన విద్య శీఘ్రముగ నభివృద్ధిజెందును. ఈ కీర్తిశేషుడు ప్రారంభవిద్యానిర్బంధశాసనము నేర్పఱచెను. వైద్యపుబిల్లు మున్నగు నిర్బంధశాసనము లనేకము లమలులో పెట్టబడెనుగాని మన దురదృష్టవశమున ప్రారంభవిద్యానిర్బంధశాసనముమాత్ర మమలులో పెట్టబడలేదు. ధీయుతులు తాముపూనినయుత్తమకార్యము నత్యంత పట్టుదలతో చేయుదురు. గావున వీరిశాసనమును నిలుపుటకై నిరంతరము పాటుపడుచుండిరి.

విశ్వబ్రాహ్మణులారా! వీరి దివ్యమంగళవిగ్రహము చిత్రపటమున మీ రందఱును జూచియేయున్నారు. ప్రస్తుతము మనదేశమునందలి ముఖ్యములగు మహాపురుషులలో నొకరు. వీరిచరిత్ర కడు గొప్పదైనను యావచ్ఛరీరమునకు శిరమే ప్రధాన మనునటుల విద్యానిర్బంధశాసనము గణనీయము. వీరి శాసనమును మన మామోదించినటుల కౌతరముసభలో దీర్మానించియున్నాము. అజ్ఞానాంధమున బడియున్న విశ్వబ్రాహ్మణులు దప్పక తెప్పరిల్లుదురని నమ్మియున్నాము. దేశమాత నేడిట్టి ప్రియపుత్రుని గోల్పోవుట మన సాంఘికులదురదృష్టమువలననే లభించెనని తలంచవచ్చును.

## నాతిప్పలు.

నాకేమితక్కువ! రూరవులసొమ్ము, అద్దాబీరొ, పిలువని పేరం--, పీట కోడుదెబ్బ. పేరంటానికి పోతే పెడతలకు కండ్లు పోతూవున్నవి. అయితే

యిప్పుడు పిలువనిదే పోవడంలేదు. పిలచితేనేమి పిలువకుంటేనేమి ఎప్పుడూ పిలిచి విందుచేయించుకోవడమే నాగతి. పోవడం రావడం మర్యాద ఒకటే. పైగా దారిలో మొట్టికాయలు తినడం. అది వారు ముఖ్యంగా చేసే మర్యాద. పంపటం తీసుకు రావడం వారివని. దారికర్చులుకూడా కన్నతండ్రివే. అయితేయేమి; యీపాడుముండ యెప్పుడు యీలాగా తిరుగుతుందని విసుక్కుంటూ వెళ్లేటప్పుడు నాలుగు వచ్చేటప్పుడు నాలుగు మొట్టికాయలు వేసి పంపిస్తారు. చిన్నపిల్లను కావున్నా పొరపాటున దారితప్పి యెక్కడికైనా పోతే వారొక నాలుగు దెబ్బలు వీరొక నాలుగు దెబ్బలు నెత్తి వీపుమీదకూడా పగులగొట్టి పంపిస్తారు. తిరిగి వచ్చేసరికి కన్నతండ్రికికూడా రోతపుట్టి ఛీ పాడుముండా అని విసరి మూల పారవేస్తారు. అయితే కొందరు పెద్దమనుష్యులు నన్ను నెత్తిమీద పెట్టుకునేటట్టు రమ్మని మర్యాదగా పిలుస్తారు. పిలచినదే చాలునని కులుకుతూ పోతాను. కొంచెము ముద్దుపెట్టుకుంటారేమో ముక్కుపట్టుకుందామని అనుకుంటానుగాని అదేమి గ్రహచారమో వీధివాకిలి దాటకముందే వద్దు పొమ్మంటారు. ఇక దగ్గరకుతీసుకున్నవారేమిసుఖపడ్డారు? నన్నేమి సంతోషపెట్టారు? ముఖంమాత్రం చూచి యిదేనా అని మూలపడవేస్తారు. కాని నాకడుపులో యెన్ని వూహలున్నవో విచారించారా? లేదుగా. ఇక దారినే పొయ్యేవారు ఎవరైనా చూచి యీపిల్ల మంచిదే, గుణంగలదే, మంచిమాటలే చెప్పుతుంటఅంటే ఇంటివారు మాకు వినటానికి చూడటానికి తీరదంటారు. ఇలా వున్నవి నాతిప్పలు. ఆమాటంటే కొందరు దీనికేమి తీపరమా యేడ్వడం నేర్చినగాని వ్యవసాయం సాగదని పగలుపోవడం మొదలుపెట్టిందంటారు. నిజమే. కనిపెంచని కూతురు గాడిదింత అని సంతోషిస్తూ గుటక దిగకుండా పోషించే మహారాజులంతా నావారే. వుండటానికి కంచంతబలగమున్నది. కంచంలో పువ్వుగల్లు చెయ్యటానికి యెవరు రారు. దయ్యాలుపోతని అన్నా చాలు. ఎవరిసొమ్మైనాసరే వున్నదంటే మర్యాద చేస్తారనుకొన్నాను. వున్నదన్నా తిప్పలే లేదన్నా తిప్పలే. అయ్యలారా! నన్ను తిప్పలుపెట్టక దయయుంచండి.

ఇట్లు విన్నవించు

ప్రబోధినీ బాలిక.

# నీతికథ.

[ సౌ॥ పావులూరి కనకదుర్గాంబ. ]

ఒక గ్రామములో నొక బ్రాహ్మణుడు తనకుమార్తెకు చాల విద్యలు చెప్పించి, ఆమెను అప్పుడప్పుడు నక్కవంటివానికిచ్చి వివాహము చేయుదునని చెప్పుచు వచ్చెను. ఆమాట నొకనక్కవిని వివాహకాలమందు వచ్చి "నాకీబాలికనిచ్చి వివాహము చేయుదునని చెప్పితివి. కావున నాకిచ్చి వివాహము చేయుము" అని బ్రాహ్మణు నడిగెను. ఆమాటవిని నీకెట్లిచ్చి వివాహము చేయుదుననగా; నాకు చాలాధనముగలదు నీకొమార్తెకేమియును లోపముండదు. ధనమునకాశపడి తాను దరిద్రుడు గావున తమార్తెనిచ్చి నక్కకు వివాహము చేసెను. కొంతకాలమయిన తరువాత బాలికను అత్తవారింటికి పంపుమనగా, బయలుదేరి ముందు నక్కయును వెనుక తండ్రియును నడచుచుండిరి. కొంతదూరము వెళ్లి నొక పొదలోనుండి కొండ సమీపముననున్న నక్కయింటికి వెళ్లిరి. బ్రాహ్మణుడు ధనముకొరకై వచ్చినవాడు గావున తనకొమార్తె కామాట చెప్పెను. ఆమె తన భర్తతో చెప్పగా, గూటిలోనున్న గుమ్మడిగింజ నిమ్మనెను. దానినామె తండ్రికిచ్చెను. బ్రాహ్మణుడు దానిని తీసుకొనిపోయి దొడ్డిలో పడవేసెను. కొంతకాలమునకది మొలచి పెద్దదై కాయలు కాచెను. వానిని అందరు తీసుకొని వెళ్లిరి. చివరకు ఒక కాయయుండగా, అల్లుడిచ్చిన గుమ్మడికాయ తినవలెను అని పగులగొట్టెను. అందులో కొన్ని బంగారు గుమ్మడిగింజ లుండెను. అదిచూచి సంతోషించి అయ్యో చాలా కాయలు పోగొట్టుకొంటినని విచారపడి విచారపడి మరల అల్లునియింటికి జని అడుగగా నొక తెప్పనిచ్చెను. ఆకలైనప్పుడు తెప్పనడుగగా అన్నమును నడించును. అది ఒకదొంగచూచి ఎత్తుకొని పోయెను. అల్లునింటికి మరలజని అడుగగా ఒక దుడ్డునిచ్చెను. దానిని కూడా వద్దించుమనగా నది తలమీద కొట్టనారంభించెను. అదివద్దని అల్లునకిచ్చివేసెను.

నీతి - తండ్రులు ధనమున కపేక్షించి కొమార్తెలు నెంత చక్కనివారైనను ఎంత విద్యనేర్చినవారైనను, నక్కవంటివానికో, కుక్కవంటి వానికో యిచ్చి వివాహము చేయుదురు. అందువలన ననేకకష్టములు సంభవించును. కావున నో తండ్రులారా! ధనమున కపేక్షించి మీ ముద్దుబిడ్డలను మూర్ఖుల కిచ్చి వివాహముచేసి వారిని దుఃఖములపాలు చేయకుడు.

---

# రాజశేఖరవిజయము.

1. రాజశేఖరము:—సుదేశమున అలఘుడను రాజు పాలించుచుండెను. ఆరాజు చాల ధనముకలవాడు. శాంతముకలవాడు. వాని భార్య సుగుణవతి. అన్నిసుగుణములును నామెయందుగలవు. ఆదంపతుల కొక్కడే కొడుకుగలడు. వాని పేరు రాజశేఖరము.

రాజశేఖరమును తలిదండ్రులు మిక్కిలి గారాబముతో పెంచుచుండిరి. ఎండగాని వానగాని వానిపై బడనీయరు. అయినను విద్యగఱపుటయందు దగు శ్రద్ధ గీసికొనుచునే యుండిరి. పదునేను వత్సరముల యీడున నతనికి సాటియైనవారు సుదేశమున లేరని యందఱు ననుకొనసాగిరి.

ఈ రాజకొమరునికి పండ్రెండుమంది గొప్పయింటిబిడ్డలు నేస్తులుండిరి. వారిలో నెల్లను విజయుడనువాడు మేటి. వినతుడను కుఱ్ఱొకడు గలడు. ఈతడు కపటి. వీనికపటము ముందుముందు తేటపడగలదు.

2. దొంగలు:—వేసగికాలమున నొకనాడు అలఘురాజు సముద్రతీరమున తిరుగుచుండెను. వానితోడ నిద్దఱు భటులుమాత్ర ముండిరి. రాజు సముద్రముపైన చూడ్కి నిగుడించి చూచెను. దూరమున వానికి పదియోడలుగా న్పించినవి. అవి నీటిదొంగల పడవలు. వారు సుదేశమును దోచుకొని ప్రజలను జంపుటకై వచ్చుచున్నారు.

చూచుచుండగనే నీటిదొంగలు రాజును చుట్టివేసిరి. కత్తులు కటారులతో నున్న దొంగలు రాజును వాని భటులను వెంటనే జంపివేసిరి. పిమ్మట వారు దేశమునజొచ్చి దేవుడుగుళ్లను పాడుచేసిరి. ధనమును దోచిరి. తోటలను పొలములను పాడుచేసిరి. మేడలను గూల్చిరి. పేదల గుడిసెలను దగులబెట్టిరి. రాణి గుణవతిని మాత్రము విశ్వాసముగల భటులు రక్షించిరి. వారామె నొక కొండగుహలో దాచిరి. పాపము రాణి పెనిమిటికొఱకు మిక్కిలి దుఃఖించినది. కొడుకుకొఱకు చాల నేడ్చినది. రాజును దొంగలు జంపిరని యామెకు దెలియును. రాజశేఖరుని నేమిచేసిరో యెఱుగదు. కావున వానిని సురక్షితముగ నుంచుమని దేవుని ప్రార్థింపసాగెను. రాత్రింబవళ్లు దేవుని వేడుచు దినములు గడుపుచుండెను.

౩. దొంగలు రాజశేఖరుని విడిచివేయుట:—దొంగలు రాజశేఖరుని వాని పండ్రెండుమంది చెలికాండ్రను దీసికొనిపోయిరి. వీరి రాజ్యము సముద్రములో లంకలందున్నది. వారు రాచబిడ్డని చంపివేయజూచిరి. కాని వారి నాయకుడొకడు రాజశేఖరుని యొక్క అందమును జూచి మనస్సు కఱిగినవాడై వానిని జంపకుండ విడిచివేయుమనెను. అంతట వారొక చిన్నపడవను జేసి దానిలో రాజపుత్రునుంచి దానిని సముద్రముమీద విడిచివేసిరి. ఆ పడవ కొంతదూరముపోయి సముద్రపు అలలచేత తలక్రిందై రాజపుత్రుడు చచ్చునని వారనుకొనిరి. ఆపడవ వేగిరము మునిగిపోవుటకు రాజపుత్రుని చెలికాండ్రనుగూడ దానిలోనె పడవేసిరి.

అలలచేత పడవ యిటునటు కొట్టుకొనుచుండెను. రాజకుమారుని చెలికాండ్రందఱును భయపడి రోదింపసాగిరి. ఇటు నటు కదలుచు గిలగిలలాడజొచ్చిరి. గాలికి గొట్టుకొనిపోవుచున్న పడవలోని పిల్లవాండ్ర రోదనధ్వనులును, భయమును దొంగలకు సంతోషము నిచ్చుచుండెను. కొంతసేపటికి పడవ దూరముగా కనబడకుండ బోయినది.

పడవలోని పిల్లవాండ్రు కదలిన కొలదిని పడవయు కదలుట హెచ్చయ్యెను. రాజశేఖరుడును విజయుడును ధైర్యముతో దక్కినవారి నోదార్చిరి.

వారు నెమ్మదిగా నుండగా పడవయు నెమ్మదిగా నీటిపైన దేలుచు పోవుచుండెను.

4. అక్రూరుడు:—రెండుదినములు గడచినవి. పడవ సురక్షితముగా బోవుచున్నది. పిల్లవాండ్ర కాకలిబాధతప్ప వేరుకష్టములు లేవు. రాజశేఖరుడు పడవ సుదేశమునకు బోవలయుననియు, తల్లిని జూడవలెననియు, తానును తన చెలికాండ్రును పెద్దవారై దొంగలరాజును జయింపవలయుననియు గోరుచు, కీర్తనలనల్లి వానిని బాడుచు దేవుని వేడుకొనుచు తన చెలికాండ్ర నందఱిచే నటుల జేయించెను. ఇట్లు వారాకలిబాధ కొంత మఱువనయ్యెను.

మూడవనాటి యుదయమున వారికి పక్షులు కలకలలాడుచుండుట వినబడినది. దూరమున చెట్లు గాన్పించినవి. కొంతసేపటికి తీరమును గట్టియు గాన్పించినది. క్రమక్రమముగ పడవ యొడ్డుచేరినది. అది అక్రూరుడను రాజునగరము. భటులు కొందఱా బాలకులను రాజునొద్దకు దీసికొనిపోయిరి.

రాజునకు వారిని జూడగానె సంతోషముకలిగినది. "ఇంత అందగాండ్రగు బాలకులను నేనెన్నడు జూడలేదు. వీరెవ్వర"ని రాజు భటుల నడిగెను. అందు కుత్తరువుగా రాజశేఖరు డిట్లనెను:—"మేము సుదేశమువారము. గొప్పవంశజులము. నీటిదొంగలు మా దేశమును దోచుకొనిరి. మా ప్రజలను జంపిరి. మమ్మును వారి రాజ్యమునకు గొనిపోయిరి. చద్పుకొఱకై మమ్మొక్క పడవలోవేసి సముద్రములో విడిచిరి. దేవుడు మమ్మిక్కడకు జేర్చినాడు. మేము దేవరవారి బానిసలము. మాయందు దయజూపి రక్షించిన రక్షింపుడు. లేకున్న మీ చిత్తమువచ్చినట్లు చేయుడు"

ఈపలుకులువిని యానందించినరాజు "బిడ్డా! నీపేరేమి అని అడిగెను'

"దేవా! నా పేరు రాజశేఖరుఁడందురు. మీకు నాసేవ యిష్టమగునేని నేను మిమ్ము గొలిచెదను" అని రాజపుత్రుడనెను.

రాజునవ్వుచు "రాజశేఖరమా! కైలాసము నేలువాడవా? రాజులకు శిఖరమువంటివాడవా? నిన్నును నీచెలికాండ్రను జూడను చ్పటగుచున్నది. మీరు నానగరున సుఖముగ నుండుడు" అని పలికెను.

రాజశేఖరమును వాని చెలికాండ్రును సుఖముగ జీవించుచుండిరి. ఆగ్రా రుని కొలువున జగజ్జెట్టియను మల్లుడుగలడు. వాని శిక్షయందుంచబడి వీరు స్వారిచేయుటను, కత్తుల ద్రిప్పుటను, ఆయుధములను బట్టుటను జక్కగ నేర్చుకొనిరి. వారందరిలో రాజశేఖరుడు మేటియై యుండెను. అందఱికంటె

( సశేషము. )

# స్వవిషయము.

---

ప్రస్తుతము వార్తాపత్రికల నేమో వాని యుపయోగ మేమో యెఱుగని వారుండరు. అయినను విధి ననుసరించి కొంచెము మనవిచేయుదును.

వార్తాపత్రికలయందలి వ్యాసములు, కథలు, విచిత్ర ప్రసంగములు, హాస్యములు, దూషణలు, మున్నగువానిని చదివినతోడనే దురాత్ముడు తన దుష్ప్రవర్తనను వదలుకొనుటకును, అవినీతిపరుడు నీతిమార్గమును ద్రొక్కుటకును, జూదరి తన యలవాటును మార్చుకొనుటకును, లంచగొండి తన కొంచపు బుద్ధిని మరలించుకొనుటకును, న్యాయాధికారియు, న్యాయవాదియు, నన్యాయపథముల ద్రొక్కకుండుటకును, ప్రతివాడును అక్రమపద్ధతి నవలంబింపకుండుటకును ప్రయత్నించక మానడు.

మన సంఘముయొక్క స్థితిగతులను తెలుపుచు, దురభ్యాసములను ఖండించుచు, సద్విషయములను బోధించుచు వెలువడుచుండిన దొక్కటియే ప్రబోధిని. ఇది ప్రస్తుతము మీపోషణ నపేక్షించియుండుటవలన మీకు బిడ్డయనియు, మీకు గావలసిన సర్వవిషయములను బోధించుటకు సిద్ధముగా నుండుటవలన మీకు తల్లియనియు చెప్పవచ్చును. ఇది యేడుసంవత్సరముల బాలిక. ఒడ్డు పొడుగు కలదికాదు. దుర్బలమైనది, రూపమునం దందగత్తెయును గాదు. మిగుల సుగుణవతి. ఉన్నవిపది లేనివిపది కల్పించి ప్రగల్భముచేయువాగాడి

బరముగలదికాదు. మితభాషిణి. మిగుల సాత్త్వికవృత్తిగలది. ఒరులు దూషించినను తాను దూషింపదు. ధర్మాధర్మములను చర్చించునపు డెంతమాత్రము మోమాటపడదు. మిగుల చమత్కారి. యుక్తిగా మాటాడుట దీని కలవాటు. ఈస్వభావమును గ్రహింపజాలక కొందరు తమ్ము దూషించుచున్నదని భ్రాంతి నొందెదరు. మితభాషణ, తగువేషము, దారిద్ర్యముగల కురూపిరాయంత సుగుణవతిరైన నెవరు ప్రేమింతురు? రూపలావణ్యము, డాబు డబ్బుల్లు ప్రధానము గాగల యీకాలమున విద్యాగుణముల నెవరుగాంతురు? అట్టివారే. మీరసాధ్యులు. పాపుష్యులు. జగదాధారులు. మీరు నిజముగా తలచుకొన్న రాయిడల కురూపులను సురూపులుగా జేయుదురు. ఇది కలియుగము. కాలానుగుణ్యముగ మాతృపోషణ ప్రబోధినికి మీచే జరుపఁబడు చున్నది.

14 వ సంవత్సరమున పూర్తిగ నిలచియున్న పత్రికను మరల నడపించిరి. మెల్లగ నడచుచున్నది. అవయవము లన్నియు పూర్తిగ స్వాధీనము కాలేదు. ధనలోపమే జన్మ. ఈవ్యాధిని నివర్తింపఁజేయుడు. ప్రాత చందాదారు లందఱికిని ముందుగా కార్డుఁబ్రాసి అక్కర లేకున్న వ్రాయుడనికోరియున్నాము. అక్కరలేదని పదుగురుమాత్రము వ్రాసియున్నారు. వి. పీలను త్రిప్పివేయువారి సంఖ్యయే మిక్కుటముగ నున్నది. పాఠకులారా! పెట్టనితల్లి పెట్టదు. తిట్టినను దీవించినను పెట్టువారినే. మీరు మీమిత్రులను ప్రోత్సాహపఱచి చందాదారులుగఁ జేయుడు.

సహాయ సంపాదకుఁడు.